ఆ సాయంత్రం మంచి బట్టలు వేసుకొని బయలుదేరాను ముందు డప్పుల వాళ్ళు – కొమ్ముల వాళ్ళు సాగుతున్నారు వారు కొమ్ములు ఊదినప్పుడు నాకు వింత అనుభూతి కలిగేది గుండెలో ఉరుము ఉరిమి క్రమంగా జారిపోతున్నట్లనిపించేది డప్పుల చప్పుళ్లకు ఎగరాలనిపించేది ఎగిరేవాణ్ణి

వారి వెనుక ఆడవారు కడవల దొంతరలు – బిందెల దొంతరలు పెట్టుకున్నారు దొంతరలకు వేప మండలు కట్టారు వేపాకు మండలు పట్టుకొని మగవారూ, పిల్లలూ సాగుతున్నారు

"వాన కురుస్తదా! చెరువు నిండుతదా! తామరలు పూస్తయా!!!" అక్కడ ఒకర్ని అడిగాను

"ఓ! కురుస్తది" అన్నాడు

తప్పేలలో నీళ్ల నెత్తిన పెట్టుకొని నేను నడిచాను

"ఆడపిల్లలు పెట్టుకుంటరు మగపిల్లలు పెట్టుకోరు" నర్సయ్య అన్నాడు నేను వినలేదు తల మీద తప్పేలతో నడిచాను

ఊరేగింపు చెరువు కట్టకు చేరింది ముత్యాలమ్మ గుడి ముందు నీళ్ళు గుమ్మరించారు నేనూ గుమ్మరించాను

"ముత్యాలమ్మ తల్లీ! వాన పడెయ్యి చెరువు నింపు తామరలు పూయించు" అని మొక్కుకున్నాను

ఆ రాత్రి వాన కోసం ఎదిరి చూచాను ఆకాశం మీదనే దృష్టి ఉంచాను నల్లని ఆకాశంలో తెల్లని చుక్కలు మిలమిలా మెరుస్తున్నాయి ఆశ మోసుకొని ఒక మబ్బు ముక్క వచ్చింది ఆశలు వమ్ము చేసింది చిటపట చినుకులు రాల్చింది తేలిపోయింది

రోజులు గడుస్తున్నాయి వాన రాలేదు చెరువు నిండలేదు తామరలు పూయలేదు

"వాన పడదా? చెరువు నిండదా? తామరలు పూయవా?" నర్సయ్యను అడిగాను

"ఇయ్యాళ సాయెబులు చెరువులో నవాజు చేస్తరట" నర్సయ్య చెప్పాడు

ఆ సాయంకాలం చెరువు దగ్గరికి వెళ్ళాను సాయెబులు తళతళ మెరిసే షేర్వానీలు వేసుకొని కూడారు కొందమందికి గడ్డాలున్నాయి

"నవాజు చేస్తే వాన కురుస్తదా! చెరువు నిండుతదా! తామరలు పూస్తయా!" ఒకరిని అడిగాను "ఓ! కురుస్తది" అన్నాడు

సాయెబులంతా చెరువులోకి దిగారు వరుసలుగా నుంచున్నారు

నేనూ వారి వెంట సాగాను నర్సయ్య వెనక్కు లాగాడు సాయెబులు వరుసలుగా వంగారు కూర్చున్నారు ఏదో చదివారు లేచారు వెళ్లిపోయారు

ఆ రాత్రి వాన కోసం ఎదిరి చూచాను ఆకాశం మీదనే దృష్టి ఉంచాను నల్లని ఆకాశంలో తెల్లని చుక్కలు మిలమిలా మెరుస్తున్నాయి ఆశ మోసుకొని ఒక మబ్బు ముక్క వచ్చింది ఆశలు వమ్ము చేసింది చిటపట చినుకులు రాల్చింది తేలిపోయింది

రోజులు గడుస్తున్నాయి వాన రాలేదు చెరువు నిండలేదు తామరలు పూయలేదు

చింతల కిందికి వెళ్ళడం మానేశాను నర్సయ్య మా ఇంటికి వస్తున్నాడు వానను గురించే ఆలోచన! ఏం చేయాలో తోచదు ఉన్నట్లుండి ఆకాశమంత పెరగా లనిపించేది అప్పుడు మబ్బుల్ని లాక్కొచ్చి కురిపించవచ్చు ముని కాళ్ల మీదతా చూస్తే గూడు అందలేదు

దేవుడు వాన పడెయ్యడం లేదు దేవుడు చెడ్డవాడా? దేవుని పటం చూచాను దేవుడి చేతిలో తామరపూవు ఉంది తామర అంటే దేవుడికి ఇష్టమే! దేవుడికి తన తామరయే ఇష్టంలాగుంది చెరువు నిండా తామరలు చూడలేడేమో! దేవుని చేతిలోని తామర లాక్కుంటే సరి! చెరువులో తామరలు పూయిస్తాడు! దేవునికి కావాలిగా ఒకటి! పీట వేసుకున్నా పటం అందలేదు

ఒకనాడు నర్సయ్య ఉరికి వచ్చి చెప్పాడు సీత వచ్చిందని వెళ్లి చూచాను సీత స్తంభం మీద మౌనంగా కూర్చుంది అశోకవనంలో సీతలా ఉంది ఆమె ముందు పూలు లేవు ఆమె మాల అల్లడం లేదు ఆమెలో విషాదచ్ఛాయలు కనిపించాయి

నేను ఆమె పాదాల చెంత కూర్చున్నాను ఆమె నన్ను చూచింది మాట్లాడలేదు నాకు దుఃఖం వచ్చింది

"సీతా! వాన పడదా? చెరువు నిండదా? తామరలు పూయవా?" నా మాటలు కన్నీట తడిశాయి

సీత నన్ను ఒక రకంగా చూచింది ఆ చూపులో ఆర్ద్రత ఉంది, తడి ఉంది, ఆప్యాయత ఉంది

"రేపు చెరువులో విరాటపర్వం పురాణం చెప్పతరట వాన వస్తది చెరువు నిండుతది తామరలు పూస్తయి " అన్నది ఆమె మాటల్లో అంతులేని విశ్వాసం దర్శనం ఇచ్చింది

"సీతా! నువ్వొస్తవా చెరువుకు?"

"వస్త కద" అన్నది ఆమె కళ్లు తామర రేకులంత అయినాయి

సీతా, నేనూ జంటగా ఇళ్లకు చేరుకున్నాం

రేపు రానే వచ్చింది గ్రామం సాంతం చెరువు దగ్గరే చేరింది నడి చెరువులో పందిరి వేశారు బారుగడ్డం – తేజోవంతము లయిన నేత్రముల స్వామి తివాచి మీద కూర్చున్నారు వారి ముందు వ్యాస పిఠం వ్యాస పీఠంలో భారతం వారి ప్రార్థన మేఘ గంభీరంగా ఉంది వారి గొంతు కంచు గంట

విరాటపర్వం ప్రారంభం అయింది

సీత మర్రి నీడలో కూర్చున్నది మాల అల్లుతున్నది నేను ఆమె పాదాల చెంత కూర్చున్నాను ఆమె వ్రేళ్ల కదలిక – మాల అల్లిక చూస్తున్నాను

"సీతా!"

సీత చూచింది

"చెరువు చూసినవా! బీటలు వారింది "

సీత తొలిసారిగా బీటలు వారిన చెరువును చూచింది చూస్తూనే ఉంది

సీత కళ్లను చూచాను

ఆమె కనులు ఎండిపోయాయి ఆమె కనుపాపల్లో బీటలు వారిన చెరువు దర్శనం ఇచ్చింది

సీత గంభీరంగా ఉంది

"సీతా!"

పలుకలేదు

"వాన వస్తుందా?"

"వాన కురుస్తుంది చెరువు నిండుతుంది తామరలు పూస్తాయి" ఆమె ధ్వనిలో శాసనం ఉంది

సీత కళ్లను చూచాను

సీత కళ్లలో నీరు నిండింది

ఆమె కనులు నిండిన చెరువుల్లా ఉన్నాయి

సీత ఆకాశంలోకి చూచింది

నేనూ ఆకాశంలోకి చూచాను

మబ్బులు కమ్ముకుంటున్నాయి ఏనుగులు గుంపులా సాగి వస్తున్నాయి చల్లని గాలి వీస్తున్నది

క్షణాల్లో అకాశం మేఘచ్ఛన్నం అయింది

ఇద్దరమూ అకాశాన్నే చూస్తున్నాం

ఫెళ ఫెళార్భటులతో ఉరుములు వినిపించాయి

శిశిర వృక్షాల్లా మెరుపులు మెరిశాయి

చినుకులు! చినుకులు! చినుకులు –

జల్లు! జల్లు! జల్లు!

జోరున వాన – విస్సురు గాలి

సీతా – నేనూ చెట్టపట్టాలు పట్టుకొని ఎగిరాం

వాన నీరు ముక్కు మీది నుంచి కారుతుంటే చప్పరించాం

వాన దంచుతున్నది

మేము ఎగురుతున్నాం

అడుతున్నాం

మంచి మనసు చలించాలి

అంతే

ప్రకృతి పులకిస్తుంది

★ ★ ★